పాషండమార్గోపదేశినగుదును. కలియుగాంతమందు విప్రశత్రుఘాతకుడనైన బ్రాహ్మణుడ నగుదును. ఇట్లు నాకు పదిజన్మలు గలుగును. ఈ పది అవతారములు వినువారికి పాతకనాశనములగును.

## 27వ అధ్యాయము

## దుర్వాససుడు అంబరీషునిగూర్చి ప్రత్యాగమనము

ఓ అగస్త్యమునీంద్రా ! భగవంతుడు ఐన పురుషోత్తముడిట్లు దుర్వాససునితో పలికి స్వభక్తపాలనదీక్షాతిశయమును ప్రకటించుచు ఇట్ల నియె.

భగవంతుడిట్లు పల్కెను. దుర్వాససా ! అంబరీషుని గురించి యిచ్చిన శాపములు నాకు చాలా సంతోషమును జేయుచున్నవి. ఈ శాపజన్మలవల్ల నాకేమీ కష్టములేదు. నీవచనము వేదతుల్యముగనుక దానిని సత్యముగా చేయవలెను. అట్లుగాని యెడల బ్రాహ్మణ మర్యాదకు భంగము కలుగును. అట్లు నాశము కలిగినంతలో నాకది శాప మగును గాన అట్టికష్టము లేక ఆనందము కలిగినది. రాజు ప్రాయోపవిష్టుడువలె బ్రాహ్మణ పరివేష్టితుడై పడియున్నాడు. అదిగాక అయ్యో బ్రాహ్మనాపకారి యీ ఆత్మ యని దుఃఖించుచున్నాడు కాబట్టి త్వరగా పొమ్ము.

రాజు యీ ప్రకారముగా చింతించి దుఃఖించుచున్నాడు. నా మూలముగా సుదర్శన చక్రము బ్రాహ్మణుని వెంటబడినది. ఛీ! ఛీ ! బ్రాహ్మణోపద్రపకారకుడయిన రాజు ఎందుకు?

రాజు మనుష్యులను పాలించువాడు గనుకను, రాజుకు ముఖ్యము ప్రజారక్షణము గనుకను, రాజు గోవుల నిమిత్తము కొరకును, బ్రాహ్మణుల నిమిత్తము కొరకును ప్రాణ ములు విడువవలెను.

రాజు స్వేదజ, అండజ, ఉద్భిజ్జ, జరాయుజములను నాలుగు విధములగు జీవములను సన్మార్గమందుంచి పాలించవలెను. అందులో అందరికిదండన మీయదగును పాలించవలెను బ్రాహ్మణులను విడువ వలెను. బ్రాహ్మణుని సత్యధర్మరతులును, లోభదంభ శూన్యులును అగు బ్రాహ్మణులే ఆతని తప్పును దెలిసికొని దండించవలెను.

బ్రాహ్మణుడు పాపమును జేసి ప్రాయశ్చిత్తమును జేసికొననిపక్షమందు అతని తలగొరిగించుట, ధనమును హరించుట, స్తానభ్రష్టత్వము మొదలయిన దండనములచేత దండించవలెను. బ్రాహ్మణుడు దుర్మార్గుడై హింసచేయుచున్నను వానిని రాజు దండించ రాదు. రాజు ధర్మార్ధబుద్ధి గలవాడగుచు యెప్పుడైనను బ్రాహ్మనునకుగాని తనకపకారము చేయువానికి గాని శస్త్రప్రయోగము ఆచరించదగును.

బ్రాహ్మణేతరులందరు భయములేక క్షాత్ర కీర్తిని చూపవలయును గాని బ్రాహ్మణ హింసమాత్రము చేయగూడదు. తాను స్వయముగా బ్రాహ్మణుని చంపినను, తన నిమిత్తమై బ్రాహ్మణుడు చంపబడినను, అన్యునిచేత చంపించినను బ్రహ్మహత్య సంభవించునని ధర్మశాస్త్రమునందు చెప్పబడియున్నది. బ్రాహ్మణుడు లాగబడిగాని, కొట్టబడిగాని, ధనహీనుడుగా చేయబడిగాని యెవనినుద్దేశించి ప్రాణములు విడుచునో వాడును బ్రహ్మ హంతకు డగును. దుర్వాసునకు ప్రాణహానికరమైన కష్టము నామూలముగా గలి గెనుగదా? కాబట్టి నేను బ్రాహ్మణహంతకుడనైతిని అని అతడు తలచుచున్నాడు. దుర్వాసా! అంబరీషుడీ ప్రసంగములో మిక్కిలిదుఃఖముతో నున్నాడు. కాబట్టి నీవచ్చుటికి త్వరగా పొమ్ము. నీకును రాజునకును కుశలమగును. ఇట్లు విష్ణువుచెప్పిన మాటనువిని దుర్వాస సుడు నమస్కరించి అప్పుడే చక్రముతోసహా బ్రాహ్మణపరివేష్టితుడైన రాజు వద్దకు వచ్చెను.

ఇట్లు సూర్యకాంతితో వచ్చుచున్న దుర్వాససునిజూచి అంబరీష మహారాజు లేచి నమస్కరించి సుదర్శన చక్రముతో యిట్లని విన్నవించెను. అంబరీషుడు పల్కెను. ఓచక్రమా ! నన్ను మన్నించుము. ఆర్తుని సంహరించుట న్యాయముగాదు గనుక బ్రాహ్మణుని రక్షించుము. అతిక్రౌర్యముతో హింసించుట తగదు. రక్షించుమని వేడుచున్న నన్నును శరణాగతుడైన బ్రాహ్మణుని రక్షించుము.

అంబరీషుడిట్లు పలుకుచు దుర్వాససుని కౌగలించుకుని తరువాత అతనిని తన వెనుక ఉంచుకొని తాను ముందు నిలబడి భయములేక ధనువును ఎక్కుపెట్టి సుదర్శనచక్రముతో ఇట్లనియెను.

## 28వ అధ్యాయము - అంబరీషకృత సుదర్శన స్తుతి

అంబరీషుడు ఇట్లు పలికెను. ఓ సుదర్శనచక్రమా ! ఆగు ఆగు. నీకు నమ స్కారము. ఈతడు బ్రాహ్మణుడు. ఇతనిని చంపుటతగదు. నీకు వధతో కూడిన ఆహారము కావలెనన్న నాశరీరమును యిచ్చెదను. ఈ బ్రాహ్మణుని విడువుము. లేనియెడల నాతో యుద్ధము చేయుము.

నీవు హరియొక్క ఆయుధముగనుక నాకు దైవమునైతివి. అయినప్పటికి నీతో యుద్ధము చేయుదునుగాని నిన్ను బ్రతిమాలుట లేదు. క్షత్రియునకు బ్రహ్మ యుద్ధ మును విధించెనుగాని యాచనను విధించలేదు. అయినను నీవు నాకు దేవతవు గనుక యాచించవచ్చును. ఓ సుదర్శనచక్రమా! నీవు సమస్త భూతములకు అజేయుడవు. ఈ మాట నాకు తెలియునుగాని అయినను నా బాహుబలమును జూడుము.

విష్ణ్వాది దేవతలందరు నీ బలమును నా బలమును చూతురుగాక, నిన్నిప్పుడు భూమియందు పడవైచెదను. అట్టి యవస్థను జెందక యీతనిని విడువుము. నీకు జీవించియుండి హరిహస్తమందు నివసించు కోరికయున్న యెడల నన్ను పాలించుము. శరణాగతుడైన యీ బ్రాహ్మణుని విడువుము. రాజిట్లు స్తుతించగా సుదర్శన చక్రదేవత సంతోషించి రాజును పరీక్షించవల యునను తలంపుతో కోపమువచ్చినవాడువలె నటించి యిట్లనియె.

సుదర్శనమిట్లు పల్కినది. రాజా! నీకుతెలియునా? మధుకైటభులను నేను చంపి తిని దేవతలకు జయించుటకు శక్యముకానివారైన రాక్షసులను అనేకులను చంపితి ననితెలియదా? ఈ దుర్వాససుని కోపముతో గూడిన ముఖమును జూచుటకెవ్వడైన సమర్ధుడున్నాడా? ఇట్టి దుర్వాససుడు శంకర బ్రహ్మలయొక్క తేజోధారియైనను యిప్పుడిట్టి అవస్థను నావలన జెందెను గదా ?

శంకరుని వలన క్షత్రియసంహారకారకమయిన తేజస్సు సంభవించి నది ఆ బ్రహ్మతేజస్సు నాకంటే అధికముగాదు. అదియు నాచేత అనేక పర్యాయములతిక్రమించ

బడినది. క్షత్రియతేజోవంతుడవైన నీవు నాతో యుద్ధమునకెట్లు సమర్థుడవగుదువు? బ్రహ్మ శంకరుల రెండు తేజస్సులు నాకు చాలనివైయున్నవి.

రాజా! క్షేమము కోరినవాడు బలవంతునితో స్నేహము చేయవలెను. ఇట్లు న్యాయముండగా నీవు మూర్ఖత్వమునవలంబించి నాతో యుద్ధమునకు సన్నద్ధుడవెందు కైతివి. నీవు హరిభక్తుడవని నేను నిన్ను ఇంతవరకు సహించితిని. కాబట్టి నీవు దూరముగా పొమ్ము, ప్రాణములను వృధాగా పోగొట్టు కొనకుము. ఇట్లు సుదర్శన చక్రవాక్యమును విని అంబరీషుడు కళ్ళెఱ్ఱజేసి సుదర్శనచక్రముతో ఇట్లనెను.

అంబరీషుడు ఇట్లు చెప్పెను. సుదర్వనచక్రమా! నీవు నాదేవునకు ఆయుధమైతివని నిన్ను బాణములచేత నూఱుఖండములుగా కొట్టలేదు. నీవు క్షత్రియధర్మము అవలంబించి నాతో మాట్లాడుచున్నావు. గనుక యిక ముందు నీకు గర్వముండబోదు. నీ గర్వమును నశింపజేయు బాణములు నా హస్తమందున్నవి. నేను బ్రాహ్మణులందును, దేవతలందును, స్త్రీల యందును, జ్ఞాతులందును, గోవులందును, బాణములను వదలను. నీవు క్రూరుడ వైనను దేవుడవగుట చేత ఇంతరకు ఉపేక్షించితిని.

నీవు దేవత్వమును వదలుకొని క్షత్రియత్వముతోగూడి నాయందు నిలచి అగ్నితో సమానమైన వేడిగల నా బాణములను సహించుము చూతము. ఇట్లని అంబరీషుడు ఇరువది నాలుగు బాణములను సుదర్శన చక్రపాదముల మీద వదలెను. ఇట్లు క్షాత్రపౌరుషముతో గూడిన రాజును జూచి సుదర్శనుడు నవ్వుచు ఇట్లనియె.

సుదర్శనుడు ఇట్లు పలికెను. రాజా ! నీ సంరక్షణనిమిత్తమే హరి నన్ను పంపినాడు. నిన్ను శరణాగతుడైన బ్రామ్మణుని విడిచితిని. సుఖముగా నుండుము. ఇట్లు పలికి ధనుర్బాణములతో గూడియున్న రాజును కౌగిలించుకుని భూమియందుపడి నమస్కారము చేసెను.

ఓ అగస్త్యా ! రాజు అలా విధేయుడైన సుదర్శన చక్రస్థ పురుషునితో చక్రముతో ఇట్లనియె. సంసార మధ్యను సంచరించెడు పురుగునైన నేనె క్కడ? హరియొక్క హస్తమందు ప్రకాశించెడి నీవెక్కడ? ఇట్లు తెలిసియు నీతోయుద్ధమునకు సన్నద్ధుడనయిన నా తప్పును క్షమించుము.

నేను నిన్ను తిరస్కరించి విజృంభించి యుద్ధమునకు సిద్ధపడితిని. క్రూరమయిన నా క్షత్రియ స్వభావమిట్లు చేసినది గనుక క్షమించుము. ఇది శుక్లపక్షము. పగలు, యుద్ధభూమి, మకరమాసము, మాఘమాసము ఇట్టి పుణ్యకాలమందు నా దేవుడైన నీ వలన మృతినిగోరియే యుద్ధమునకు వచ్చితిని. భగవద్గీతయందు ఇట్లుకలదు.

ఉత్తరాయణమందు శుక్లపక్షమందు పగలు మృతినొందినవారు అర్చిరాది మార్గమునపోయి బ్రహ్మపదమును జేరుదురు. కార్తిక శుక్ల ద్వాదశినాడు వెళ్లిన దుర్వాసుడు మాఘమాసమునకు తిరిగివచ్చెను. సుమారు 3 మాసాలకుఅంబరీషుని చేరినాడు.

జ్వాలలచేత భయంకరమును, దేవదానవుల కసహ్యమును, నూరు మెరుపులకంటే అధికమయిన కాంతిగలదియునయిన నీరూపమునుగవ్వతో సమానుడను నేనెట్లు సహింతును? సహస్రాగ్నియుతమైన రవిబింబమువలె సహస్రారములను ధరించునటు వంటి సమస్త సంహారకరమగునటువంటి నీ రూపముతో యుద్ధముచేయ నేనెట్లు శక్తుడ నగుదును?

కోరలతో గూడిభయంకరము దశదిక్కులందు అగ్నులను బయటికి చిమ్ముచున్నటు వంటి నీ యొక్క దంతపుదెబ్బను దేవుడుగాని, రాక్షసుడు, దేవేంద్రుడుగాని, రాక్షసాధిపతి గాని యింకెవ్వడుగాని సహించగలడు?

మెరుపులనుసూర్యుని కిరణజాలములును మొత్తములై భయంకరా కారములను ధరించి వచ్చినను నీ తేజస్సును తిరస్కరించలేవు. విష్ణువు భయంకారాకరమయిన నిన్నా శ్రయించి మూడులోకములను పాలించుచున్నాడు. నీతో విరోధించినయెడల దేవతలుగాని, దానవులుగాని, అన్యులు గాని నిన్ను జయించలేరు.

దైత్యులను చంపుదానవు భక్తులను పరిపాలించునావు. విష్ణువుయొక్క కాంతిచేత ప్రకాశించుదానవు. ప్రాణగమనకష్టమును హరించుదానవు అగు నీకునమస్కారము.

ఇట్లు స్తుతించి భూమియందు నమస్కారముచేయుచున్న రాజును లేవదీసి నీకు క్షేమమగుగాక అని సుదర్శనుడుపలికెను. ఈ సుదర్శనచక్ర స్తోత్రమును మూడు కాలము లందు పఠించువాడు ఆపదలనుండి విముక్తుడై చిరతరసుఖములను బొందును. కలియుగ మందీ యధ్యాయమును ఒకమారయునను వినువారు అనేక భోగములుపొంది అంత మందు మోక్షము పొందుదురు.

## 29వ అధ్యాయము - అంబరీషదుర్వాస సంభాషణము

రాజు చూచుచుండగానే సుదర్శన చక్రమంతర్థానమొందెను. సుదర్శన చక్రము అంతర్థానము బొందిన తరువాత అంబరీషుడు భక్తితో దుర్వాససునకు నమస్కరించి శిరస్సుతో వందనమాచరించి భక్తిచేత పులకాంకితుడై తనశిరమును మునిపాదములపైన బడవేసియిట్లని విన్న వించెను.

బ్రాహ్మణోత్తమా ! నేను మహాపాపిని. పాపమునందు మునిగి ఉండి కష్టించు చున్నాను. కాబట్టి గృహస్థుడనైన నా యింటిలో అన్నమును భుజించి నన్నుద్ధరించుము. నీవు నాయందుదయయుంచి తిరిగి నాయింటికివచ్చి నన్ను రక్షించితివి. మూడు లోకము లకు భయమును గలిగించు నీకు భయమెక్కడిది ? భయమనుమిషతో నన్ను రక్షించుటకు తిరిగి నా యింటికి వచ్చితివి.

నీవు తిరిగి వచ్చుటచేత నేను బ్రతికితిని. నాకు పరలోకముసిద్ధించును. కాబట్టి త్వద్దర్శనదానముతో నాకభయదానము, దానితో ప్రాణదానము, దానితో పరలోక దానము సంభవించినవి.

ఇట్లు విన్నవించుచున్న రాజును తన బాహువులతో లేవనెత్తి దుర్వాస మహాముని ఆనందముతో ఇట్లనియె. రాజా! ప్రాణములను రక్షించువాడు తండ్రియని చెప్పబడును. ఇప్పుడు నీ చేత నా ప్రాణములు రక్షించబడినవి గనుక నాకు తండ్రిని నీవే. నేను నీకిప్పుడు నమస్కారము చేసిన యెడల నీవు దుఃఖించెదవు. తండ్రికి కష్టముగలిగెడి వ్యాపారము చేయగూడదు. గాన నీకు నమస్కారమును జేయను. బ్రహ్మణ్యుడనైన నేను నీకు గొప్పకష్టమును గలిగించితిని. దానికి ఫలమును అనుభవించితిని. చివరకు నీవు

దయతో ఆ కష్టమును నివారించతివి. రాజా ! నీతో కూడా భుజించెద నని దుర్వాసుడు ధర్మబుద్ధిగలవాడై ధర్మవేత్త యయిన అంబరీషునితో కూడి భుజించెను. సాక్షాత్ శివరూపుడైన దుర్వాసుడు విష్ణుభక్తుని యొక్క మాహాత్మ్యమును పరీక్షించ గోరివచ్చి యిట్లు పరీక్షించి సంతోషించి ఆజ్ఞా పితుడై స్వాశ్రమమునకు వెళ్ళెను.

కాబట్టి కార్తికమాసమందు హరిబోధినీ ద్వాదశి సమస్త దానఫలప్రదము, సమస్త తీర్థఫలప్రదము, సమస్త యజ్ఞఫలప్రదమగును. కార్తిక మాసమందు శుక్లైకాదశినాడు ఉపవాసమాచరించి జాగరణముండి ద్వాదశి నాడు దానములిచ్చి బ్రాహ్మణులతో కలసి పారణజేయువాడు మహాపాతక విముక్తుడగును. మోక్షమును గోరిన విష్ణుభక్తులు ద్వాదశి స్వల్పముగా నున్నప్పుడు దానిని విడువక ద్వాదశి ఘడియలలోగానే పారణచేయ వలయును. అందులో కార్తిక శుక్ల ద్వాదశి మిక్కిలి పుణ్యప్రదము గనుక దానిని యెంత మాత్రము విడువరాదు.కార్తిక శుక్ల ద్వాదశియందు చేసిన పుణ్యముస్వల్పమైనను అనంత ఫలప్రదము.

ఈ పుణ్యకథను వినువారు పాపవిముక్తులై పుత్రపౌత్ర సమేతులై అనేక భోగములననుభవించిఅంతమందుపరమపదము పొందుదురు.

## 30వ అధ్యాయము - ధర్మసూక్ష్మ కథనము

ఋషులడిగిరి. ఓ సూతమహర్షీ ! మాకు పుణ్యమైన హరి మాహాత్మ్యమును జెప్పితివి.ఇంకా కార్తికమాహాత్మ్యమును వినగోరితిమి చెప్పవలసినది.

కలియుగమందు కలుషితమానసులై రోగాదులకు లోబడియుండి సంసార సముద్రమందు మునిగియున్న వారికి అనాయాసముగా పుణ్యము లభించెడిదియేది ?

ధర్మములలో యెక్కువ ధర్మమేది? దేనివలన మోక్షము సిద్ధించును? దేవతలలోపల యెక్కువ దేవుడెవ్వడు? ఏ కర్మచేత మోహము నశించును? కలియుగమున మానవులు మందమతులు జడులు, మృత్యుపీడితులును అగుదురు. వారికి అనాయాసముగా మోక్షముదొరికెడి ఉపాయమును జెప్పుము.ఇంకా ఇతరమైన హరికథను జెప్పుము.

సూతుడు పల్కెను. మునీశ్వరులారా ! మీరడిగిన ప్రశ్న చాలా బాగు న్నది. మంగళకరమైన హరికీర్తన స్మృతికి వచ్చినది. కాబట్టి సర్వసుఖకర మైన దానిని చెప్పెదను వినుడు.

మీరు అల్పబుద్ధులయిన జనులకు మోక్షపాయమును జెప్పుమని కోరితిరి. ఈ ప్రశ్నలోకోపకారము కొరకయినదుటచేతనాకు చాలా ఆనంద దాయకమైనది. అనేక యాగములు చేసియు, అనేక పుణ్యతీర్థములందు స్నానాదికమాచరించియు ఏ ఫలమును బొందెదరో ఆ ఫలము ఈలాటి మంచిమాటలచేత లభ్యమగును.

మునీశ్వరులారా ! వినుడు. కార్తికఫలము వేదోక్తమైనది. అనగా కార్తికమందు వేదోక్తఫలమును బొందెదరని భావము.కార్తిక వ్రతము హరికి ఆనందకారణము, సర్వశాస్త్రములను సంపూర్ణముగా చెప్పుటకు నేను సమర్థుడనుగాను, కాలము చాలదు, కాబట్టి శాస్త్రసారములలోసారమును జెప్పెదను వినుడు.

శ్రీహరికథను సంగ్రహముగా చెప్పెదను వినుడు. శ్రీహరికాసక్తులు ఘోరమైన నరకాలయందు పడక సంసార సముద్రమునుండి తరింతురు.

కార్తికమందు హరిని పూజించి స్నానము, దానము, ఆలయము లందు రాత్రి దీపమునువెలిగించుటను జేయువారు అనేక పాపములనుండి శీఘ్రముగా ముక్తు లగుదురు. సూర్యుడు తులారాశి యందు ప్రవేశించినది మొదలు ముప్పది దినములు ఒక్క కార్తికవ్రతమును జేయవలెను. అట్లు చేయువాడు జీవన్ముక్తుడగును. సుమా.

బ్రాహ్మణులుగాని, క్షత్రియులుగాని, వైశ్యులుగాని, శూద్రులుగాని, స్త్రీలుగాని కార్తికవ్రతమును జేయని యెడల తమ పూర్వులతో కూడా అంధతామిస్రమను పేరుగల నరకమును, (చీకట్లతో గ్రుడ్డిదగు నరకము) బొందుదురు. సంశయములేదు.

కార్తికమాసమున కావేరి జలమందు స్నానమాచరించువారు దేవతలచేత కొనియాడబడి హరిలోకమును బొందుదురు. కార్తికమాసమందు స్నానముచేసి హరిని పూజించు మానవుడు విగతపాపుడై వైకుంఠమును జేరును.

మునీశ్వరులారా ! కార్తికవ్రతమును జేయనివారు వేయి జన్మము లందు చండాలురై పుట్టుదురు. కార్తికమాసము పుణ్యకరము. సమస్త మాసములందు శ్రేష్ఠము. కార్తికవ్రతము హరిప్రీతిదాయకము. సమస్త పాపహరము. దుష్టాత్ములకు అలభ్యము. తులయందు రవియుండగా కార్తికమాసమందు స్నానమును, దానమును, పూజను, హోమమును, హరిసేవను జేయువారు సమస్త దుఃఖవిముక్తులై మోక్షమొందెదరు.

కార్తికమాసమందు దీపదానము, కంచుపాత్రదానము, దీపారా ధనము, ధాన్యము, ఫలము, ధనము,గృహదానము అనంతఫలప్రదములు.

ధనికుడుగాని, దరిద్రుడుగాని హరిప్రీతి కొరకు కార్తికమాసమందు కథను విన్న యెడల వినిపింపచేసిన యెడల అనంతఫలమునొందును. కార్తిక మాహాత్మ్యము సర్వపాప ములను నశింపజేయును. సమస్త సంపత్తు లను గలుగజేయును. అన్ని పుణ్యములకంటేను అధికము. ఎవడు ఈ పవిత్రమగు విష్ణువుకు ప్రీతికరమగు అధ్యాయమును వినునో వాడు ఈ లోకమున గొప్పసుఖాలను అనుభవించి పరలోకమున బ్రహ్మానందము పొందును. తిరిగి ఒక జననమరణ ప్రవాహమున పడకుండ జేయునదియే పరసుఖము లేక నిత్యసుఖము.

-:సమాప్తం :-

### శివ మంత్రం

ఓం నమః శంభవే చ మయోభవే చ నమః శంకరాయ చ మయస్కరాయ చ నమః శివాయ చ శివతరాయ చ

### మృత్యుంజయ మహామంత్రం

ఓం త్ర్యంబకం యజామహే
సుగంధిం పుష్టివర్ధనం ।
ఉర్వారుకమివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్॥

### శివపంచాక్షరీ మంత్రం

ఓం నమశ్శివాయ

### శివ - రుద్ర గాయత్రీ

గౌరీనాథాయ విద్మహే
సదాశివాయ ధీమహి
తన్నశ్శివః ప్రచోదయాత్॥

తత్పురుషాయ విద్మహే
మహాదేవాయ ధీమహి
తన్నో రుద్రః ప్రచోదయాత్॥

## 1. అమరావతి

గుంటూరు నుండి 27 కి.మీ. వున్న అమరావతికి ప్రతి అరగంటకు బస్సులు తిరుగుతూ వుంటాయి. ఇక్కడ ఒకనాడు బౌద్ధులు విశ్వవిద్యాలయాలు స్థాపించి, మహోన్నతమైన చరిత్ర సృష్టించారు. విశ్వవిఖ్యాతిని వెలయించారు. ఆనాటి వైభవాల చిహ్నాలు చరిత్రలో ఈనాటికీ సాక్ష్యం పలుకుతున్నాయి. పంచారామాలయిన అమరామము, కొమరారామము, భీమారామము, ద్రాక్షారామము, క్షీరారామములలో మొదటిది, పావన కృష్ణానదీ తీరమున నెలకొనియున్న ఈ క్షేత్రము క్రీస్తుపూర్వం కాలమునుండి సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రముగా పేరుగాంచియున్నది. ఇక్కడి ప్రాచీనబౌద్ధస్తూప ములు, శిల్పములు లెక్కకు మిక్కుటంగా వుండి పూర్వపు ఔన్నత్యమును చాటుతూ శిల్పకళావిశేషములను చెప్పుతాయి. ఇది శాతవాహనుల కాలంనాటి వరకూ ఒక గొప్ప రాజధానినగరంగా అభివృద్ధి చెందిన చిహ్నాలు కనబడుతున్నాయి. ఇక్కడి అమూల్య బౌద్ధ శిల్పాలు చాలావరకు కొన్నిటిని లండన్ తీసికొని వెళ్ళిపోయారు. మరికొన్ని కలకత్తా, మద్రాసు నగరాల్లోని మ్యూజియంలకు చేర్చారు. నాగార్జునకొండ వద్దగల బౌద్ధశిల్పాల కంటే గూడ ఇక్కడి శిల్పాలు ఎంతో నాజూకుగా నున్నాయి.

ఈ నగరం ఆంధ్రరాజులు పరిపాలించిన క్రీ.శ. 6వ శతాబ్దికాలంలో సుమారు 12 మైళ్ళు విస్తీర్ణముగల మహానగరం. శాతవాహనులు వైదికులైనా బౌద్ధమతమును నిరసించలేదు. అందువలన బౌద్ధులు ఇక్కడ చేరారు. ఇక్కడ నిర్మించబడిన బౌద్ధ మహా చైత్యంతాల స్థూపం ప్రఖ్యాతి గాంచిన రాంచీ స్థూపంకంటే ఎంతో గొప్పది. పెద్దది శాతవాహనుల పతనంతో మహానగర ప్రాభవం క్షీణించింది. కొండవీటి రెడ్డిరాజుల కాలంలో పునరుద్ధరించబడింది. బౌద్ధం క్షీణించగానే హిందువులు బౌద్ధస్తూప స్థానంలోనే అమరేశ్వరాలయం ఏర్పరచారు. ఈనాడు అమరావతీ నగర ప్రాభవాన్ని కోల్పోయి కేవలం ఒక గ్రామంగా మాత్రం మిగిలింది.

ఇక్కడ ముఖ్యంగా చూడదగినది అమరేశ్వరాలయము. వెలసిన దేవుడు అమరేశ్వరస్వామి. దేవేరి రాజ్యలక్ష్మి అమ్మవారు. పంచప్రాకారాల మధ్య ఆలయం ఎత్తుగ నిర్మించబడింది. ఇక్కడ లింగము సుమారు 15 అడుగులు ఎత్తున వుంటుంది. 3 అడుగుల కైవారంతో తెల్లగా వుంటుంది. ఈ లింగ మునుగూర్చి ఒకవింత ప్రచారంలో ఉంది. ఈ శివలింగము దినదినము పెరుగుతుందనిన్నీ, ఆలయం ఎంత పెంచినప్పటికీ చాలకపోవటంతో ఆలయ నిర్మాతలు లింగము పెరగకుండా నివారించాలనే ఉద్దేశ్యంతో లింగంనెత్తిపై ఒక మేకుని కొట్టారని అంతటితో పెరుగుదల ఆగిపోయిందని, సమాచారం, దీన్ని ఋజువు పరుస్తున్నట్లుగా లింగం చాలాఎత్తుగా ఉండి నెత్తిపైని మేకు, మేకు కొట్టి నపుడు స్రవించిన రుధిర ధారల చారలు గుర్తులున్నాయి. స్వామికి అభిషేకము చేయాలన్నా పైకెక్కి వెళ్ళి చేయాల్సివుంది.

ఈ అమరావతి ఒకపురాణకథ కూడా వుంది. దేవేంద్రుడు అహల్యాజారుడై తత్పాప పరిహారార్థం ఇక్కడ శివలింగమును ప్రతిష్ఠించాడని దేవతల ప్రభువైన సురేంద్రునిచేత ప్రతిష్ఠించబడినది గాబట్టి 'అమరావతి' నామము సార్ధకంగా ప్రసిద్ధమయింది అని అంటారు. ఇక్కడ దగ్గరలోనే దీపాలతిన్నె అనే ప్రదేశం వుంది. బౌద్ధ విగ్రహాలు, స్థూపాలు



గలిగినదీచోటు, ఇది అర్కిలాజికల్ డిపార్ట్‌మెంటు వారు నాటి ఔన్నత్యపు చిహ్నాలను తమ అధీనంలో వుంచుకొని ప్రాచీన కళా సంపదను కాపాడుతూ ఉన్నారు. చరిత్ర అధ్యయన పరులకు ఇవి యెంతో ఉపయోగకరంగా కూడా ఉంటాయి. ఇక్కడికి 2 కి.మీటర్లు దూరంలో ప్రాచీన ధరణికోట లేక ధాన్యకటకం ఉంది.

క్రీ.శ. 90 సంవత్సరపు కాలంలో ఆంధ్రప్రభువు 'గౌతమీపుత్ర శాతకర్ణి' ఈ ధరణి కోటను రాజధానిగా చేసికొని రాజ్యపాలన చేశాడు ఇక్కడ ఒకబౌద్ధ విశ్వవిద్యాలయము వెలసి ఆనాడు విశ్వ విఖ్యాతిగాంచినది. పూర్వపు ఆంధ్రుల ఔన్నత్యాన్ని ప్రశంసిస్తూ ఒక ఆధునిక కవి శ్రేష్ఠులు 'అమరావతీ నగరాన బౌద్ధులు, విశ్వవిద్యాలయములు స్థాపించినారు అని ఆనాటి ఔన్నత్యం క్షీణించి ఈనాటి తెలుగువారు చలిచీమల పుట్టయినారు అని వాపోతూ 'దిద్దుకోవమ్మ బిడ్డల తెలుగుతల్లీ అని ప్రభోదిస్తూ వాపోయారు. అమరావతిలో మతవ్యాప్తి, ధాన్యకటకంలో విద్యావ్యాప్తి చేసినది చరిత్ర చాటిచెప్పిన సత్యం. ఏదీ మరి ఆనాటి ప్రాభవం? ఎక్కడ ఆ తెలుగు వెలుగులు దీధితులు కనీసం చూచి అయినా తరించవచ్చునే !

## 2. కుమారారామము

చరిత్ర: సామర్లకోటలోని కుమారారామ భీమేశ్వరస్వామి దేవస్థానం పంచారామాల్లో ఒకటి. క్రీ.శ. 892 నుంచి 922 వరకు తూర్పు చాళుక్యరాజుల కాలంలో నిర్మితమైనట్లు శాసనాల ద్వారా తెలుస్తోంది. పిఠాపురంలోని ఒకశాసనం ప్రకారం 9వ శతాబ్దం చివరిలో చాళుక్యభీముడే సామర్లకోటలో కుమారచాళుక్య భీమేశ్వరాలయాన్ని కట్టించినట్లు శాసనాలు తెలుపుతున్నాయి. ఇది పూర్వ చాళుక్య భీమవరంగా ప్రసిద్ధి చెందినట్లు ఆలయంలోని శాసనాలనుబట్టి తెలుస్తుంది. భీమేశ్వరాలయం సామర్లకోట రైల్వేస్టేషన్‌కు దక్షిణంగా ఒక కిలోమీటరు దూరంలో ఉంది.

పేరెలావచ్చింది : ఈ ఆలయాన్ని స్వయంగా కుమారస్వామే ప్రతిష్ఠించడంవల్ల దీనికి 'కుమారారామం' అనిపేరు వచ్చిందని పౌరాణిక ప్రశస్తి ఉంది. చారిత్రకంగా క్రీ.శ.872 నుంచి 921 వరకు మొదటి చాళుక్యభీమనృపాలుడు కుమారామామాన్నే తన రాజధానిగా చేసుకుని రాజ్య పాలనచేసి భీమేశ్వరస్వామిపై అమిత భక్తితో ఆలయానికి సువిశాలమైన ప్రాకారమంటపాదులను నిర్మించారు. రాజుపేరు, స్వామిపేరు కలసి ఈ ప్రాంతం 'చాళుక్యభీమవరంగా' ప్రాచుర్యం పొందింది.

ఆలయవిశేషాలు : సామర్లకోట, ద్రాక్షారామ భీమేశ్వరాలయాలు రెండూ ఒకేరకమైన నిర్మాణ శైలిలో కనిపిస్తాయి. దేవాలయం రాతితో కట్టిన రెండు ప్రాకారాలు నడుమ రెండతస్తులలో ప్రధానాలయం నిర్మితమై ఉంది. కుమారామ భీమేశ్వరస్వామివారి దేవేరిని బాలాత్రిపురసుందరిగా పిలుస్తారు.

శిలాశాసనాలు : క్రీ.శ 1447 నుంచి 1494 వరకు గల మధ్యకాలంలో జారీచేసిన 31 శాసనాలు ఈ ఆలయంలో ఉన్నాయి. ఇవన్నీ దానశాసనాలే వీటిని కొన్నిటిని బట్టి తూర్పున ఉన్న ముఖమంటప నిర్మాణం క్రీ.శ 1394 లోనూ నిలువుమంటపాలు క్రీ.శ 1422లోనూ నిర్మించినట్లు తెలుస్తోంది.

## 3. భీమవరం

నర్సపూరు, సికింద్రాబాదు రైల్వేలైనులో భీమవరం టౌను స్టేషనులో దిగవచ్చును. ఇది పంచా రామాల్లో ఒకటైన భీమారామము. ఇక్కడ వేంచేసియున్న స్వామి సోమేశ్వరస్వామి, సోముడనగా చంద్రుడు. చంద్రునిచే ప్రతిష్ఠించబడిన లింగము గనుక సోమేశ్వరక్షేత్రమని పేరుగలిగినది. దీని వైశిష్ట్యములో పద్మపురాణంలో చెప్పబడింది. చంద్రుడు తన గురువగు బృహస్పతి భార్యయైన తారను కామించి పాపమును బోగొట్టు కొనటానికి అమృతలింగా భాగాన్నొక దానిని తెచ్చి ప్రతిష్టించాడు. అందుచేతనే గాబోలు చంద్రుని షోడశ కళలు లింగము మీద దర్శించవచ్చు అమావాస్యనాడు లింగము నల్లగ ఉండి పూర్ణిమకు తెల్లగా స్ఫటిక సదృశమై వుంటుంది. సోమకుండ స్నానము పంచమహా పాప ముల పరిహరిస్తుందని ప్రతీతి.

## 4. ద్రాక్షారామము

ఎక్కడుంది : ద్రాక్షారామ, రామచంద్రపురం మండలం.

చరిత్ర : క్రీ.శ. 11వ శతాబ్ది నుంచి 15వ శతాబ్ది వరకు ఈ ఆలయం వైభవంగా విరాజిల్లిందని ఇక్కడి శాసనాల ద్వారా తెలుస్తోంది. చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు మొదలైన వారంతా భీమేశ్వరుని సేవలో తరించారని ఆలయాభివృద్ధికి విశేషకృషి చేశారని తెలుస్తోంది. పేరెలా వచ్చింది : దక్షప్రజాపతి ఆరామం కావడంతో దీన్ని దక్షారామం పిలిచేవారు ఇక్కడ దక్షుడు యజ్ఞంచేశాడని ప్రతీతి.

ప్రాశస్త్యం : స్వయంభువై వెలసిన ద్రాక్షారామ భీమేశ్వర స్వామికి ఉన్న పురాణఖ్యాతి అమోఘ మైనది. కాశీక్షేత్రంతో సమానమైనదిగా పేరున్న ద్రాక్షారామ దక్షిణకాశీగా విరాజిల్లుతోంది. శ్రీనాధుడు రచించిన 'భీమఖండం' కావ్యంలో ఈ క్షేత్ర ప్రాముఖ్యాన్ని వివరించారు. కోరిన కోర్కెలుతీర్చే నీలకంఠుడిగా ఆయనంటే భక్తులకు అపారమైన నమ్మకం. అందుకనే ద్రాక్షారామ స్థలాన్ని దక్షిణకాశీగా పిలుస్తారు. ఇక మాణిక్యాంబ అమ్మవారున్న పీఠం అష్టాదశ పీఠాల్లో ఒకటి ఆలయ సన్నిధిని చేర్చి ఉన్న గోదావరిని పవిత్ర సప్తగోదావరిగా పిలుస్తారు శివుడికి ప్రీతిపాత్రమైన మహా శివరాత్రి పర్వదినాన భక్తులు సప్తగోదావరిలో స్నానమాచరించి మాణిక్యంబ సమేత భీమేశ్వరస్వామిని మహాశివరాత్రి పర్వదినాన ద్రాక్షారామకు వేలాది సంఖ్యలో భక్తులు దర్శనానికి వస్తారు.

## 5. పాలకొల్లు (క్షీరారామము)

ఒకరకంగా ఇది సార్థకనామం. పరమశివుడు తన త్రిశూలంతో ఒక సరస్సును నిర్మించి క్షీరసాగరము నుండి పాలనాకర్షించి సరస్సును నింపెనట, కాలక్రమేణా పాలకొలను పాలకొల్లుగా ప్రసిద్ధి చెందింది.

పాలకొలనుగా : క్షీరం అంటే పాలు, క్షీరమున కారామము పాలకొలను క్షీరా రామము పంచారామాల్లో ఒకటిగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడి స్వామి రామలింగేశ్వరుడు లింగము 18 అంగుళముల యెత్తుంది. పాలరాతితో స్వయంభువు స్వామికి వెనుక భాగంలో మూడు చారలున్నాయి. ఇవి జటలని ప్రతీతి. తారకాసురుడు పూజించిన అమృత లింగానికి శిరోభాగమని కూడా కొందరంటారు. 11 అంతస్తుల గాలిగోపురం 1777లో నిర్మించబడింది ఆంధ్రలో ఎత్తైన గాలిగోపురాల్లో నాల్గోస్థానాన్ని ఆక్రమిస్తుంది.

### శ్రీ శివస్తోత్రం

వందే శంభుముమాపతిం సురగురుం వందేజగత్కారణం
వందే పన్నగ భూషణం మృగధరం వందే పశూనాంపతిం
వందే సూర్యశశాంకవహ్ని నయనం వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రయించ వరదం వందేశిం శంకరం॥

### శ్రీ విష్ణుస్తోత్రం

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం ॥

### శివప్రాతస్మరణమ్

ప్రాతఃస్మరామి భవభీతిహరం సురేశం గంగాధరం వృషభవాహన మంబికేశం ।
ఖట్వాంగశూల వరదాభయ హ సమీశం సంసార రోగహర మౌషధ మద్వితీయమ్ ॥ 1
ప్రాతర్నమామి గిరీశం గిరిజార్ధదేహం సర్గస్థితి ప్రళయకారణ మాదిదేవం ।
విశ్వేశ్వరం విజిత విశ్వమనోభిరామం సంసార రోగహర మౌషధ మద్వితీయం॥ 2
ప్రాతర్భజామి శివమేక మనంతమాద్యం వేదాంత వేద్యమనఘం పురుషం మహాంతమ్ ।
నామాది భేదరహితం షడ్భావశూన్యం సంసార రోగహర మౌషధ మద్వితీయమ్ ॥ 3
ప్రాతః సముత్థాయ శివం విచింత్య శ్లోకత్రయం యే సుదినం పఠంతి।
తే దుఃఖజాతం బహుజన్మ సంచితం హిత్వాపదం యాంతి తదేవశంభోః॥ 4

### శివాష్టకమ్

ప్రభుం ప్రాణనాథం విభుం విశ్వనాథం జగన్నాథనాథం సదానందభాజమ్
భవద్భవ్యభూతేశ్వరం భూతనాథం శివం శంకరం శంభు మీశాన మీడే. 1
గళే రుండమాలం తనౌ సర్పజాలం మహాకాలకాలం గణేశాదిపాలం
జటాజూటగంగోత్తరంగైర్విశాలం శివం శంకరం శంభు మీశాన మీడే. 2
ముదామాకరం మండనం మండయంతం మహామండలం భస్మభూషాధరంతమ్
అనాదిం హ్యపారం మహామోహమారం శివం శంకరం శంభు మీశానమీడే. 3
వ(త)టాథో నివాసం మహాట్టాట్టహాసం మహాపాపనాశనం సదాసుప్రకాశమ్
గిరీశం గణేశం సురేశం మహేశం శివం శంకరం శంభు మీశానమీడే. 4
గిరీంద్రాత్మజాసంగృహీతార్ధ దేహమ్ గిరౌ సంస్థితం సర్వ దాపన్న గేహమ్
పరబ్రహ్మ బ్రహ్మాదిభి ర్వంద్యమానం శివం శంకరం శంభు మీశాన మీడే. 5
కపాలం త్రిశూలం కరాభ్యాం దధానం పదాంభోజ నమ్రాయ కామం దధానం
బలీవర్ధయానం సురాణాం ప్రధానం శివం శంకరం శంభు మీశాన మీడే. 6
శరచ్చంద్రగాత్రం గణానందపాత్రం త్రినేత్రం పవిత్రం ధనేశస్య మిత్రమ్
అపర్ణాకళత్రం సదా సచ్చరిత్రం శివం శంకరం శంభు మీశాన మీడే. 7
హరం సర్పహారం చితాభూవిహారం భవం వేదసారం సదా నిర్వికారం
శ్మశానే వసంతం మనోజం దహంతం శివం శంకరం శంభు మీశాన మీడే. 8
స్వయం యః ప్రభాతే నర శ్శూలపాణేః పఠేత్ స్తోత్రరత్నం త్విహ ప్రాప్యరత్నమ్
సుపుత్రం సుధాన్యం సుమిత్రం కళత్రం విచిత్రైస్సమారాధ్య మోక్షంప్రయాతి. 9

### శివపంచాక్షర స్తోత్రమ్

నాగేంద్ర హారాయ త్రిలోచనాయ భస్మాంగరాగాయ మహేశ్వరాయ।
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ తస్మై న కారాయ నమశ్శివాయ॥
మందాకినీ సలిల చందన చర్చితాయ నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ।
మందార ముఖ్య బహుపుష్ప సుపూజితాయ తస్మై మ కారాయ నమశ్శివాయ॥
శివాయ గౌరీ వదనారవింద సూర్యాయ దక్షాధ్వర నాశకాయ ।
శ్రీ నీలకంఠాయ వృషభధ్వజాయ తస్మై శి కారాయ నమశ్శివాయ ॥

వసిష్ఠ కుంభోద్భవ గౌతమాది మునీంద్ర సేవార్చిత శేఖరాయ ।
చంద్రార్క వైశ్వానర లోచనాయ తస్మై వకారాయ నమశ్శివాయ ॥
యక్షస్వరూపాయ జటాధరాయ పినాకహస్తాయ సనాతనాయ ।
సుదివ్య దేహాయ దిగంబరాయ తస్మై య కారాయ నమశ్శివాయ॥
పంచాక్షరమిదం పుణ్యం యఃపఠేత్ చ్ఛివసన్నిధౌ ।
శివలోక మవాప్నోతి శివేనసహ మోదతే ॥

## లింగాష్టకమ్

బ్రహ్మమురారి సురార్చితలింగం నిర్మల భాసిత శోభితలింగం
జన్మజదుఃఖ వినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 1
దేవముని ప్రవరార్చితలింగం కామదహన కరుణాకరలింగం
రావణదర్ప వినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 2
సర్వసుగంధి సులేపితలింగం బుద్ధివివర్ధన కారణలింగం
సిద్ధసురాసుర వందితలింగం తత్ప్రణమామి సదాశివలింగం 3
కనకమహామణి భూషితలింగం ఫణిపతివేష్టిత శోభిత లింగం
దక్షసుయజ్ఞ వినాశనలింగం తత్ప్రణమామి సదాశివలింగం 4
కుంకుమచందన లేపితలింగం పంకజహార సుశోభిత లింగం
సంచితపాప వినాశనలింగం తత్ప్రణమామి సదాశివలింగం 5
దేవగణార్చిత సేవితలింగం భావైర్భక్తిభి రేవచలింగం
దినకరకోటి ప్రభాకరలింగం తత్ప్రణమామి సదాశివలింగం 6
అష్టదళోపరి వేష్టితలింగం సర్వసముద్భవ కారణలింగం
అష్టదరిద్ర వినాశనలింగం తత్ప్రణమామి సదాశివలింగం 7
సురగురు సురవరపూజిత లింగం సురవనపుష్ప సదార్చితలింగం
పరమపతింపరమాత్మకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 8
లింగాష్టక మిదంపుణ్యం యఃపఠేచ్ఛివసన్నిధౌ శివలోక మవాప్నోతి శివేన సహమోదతే.

## బిల్వాష్టకమ్

త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చ త్రియాయుధం
త్రిజన్మ పాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్ 1
త్రిశాఖైర్బిల్వపత్రైశ్చ అచ్ఛిద్రైః కోమలై శ్శుభైః
తవపూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్. 2
అఖండబిల్వపత్రేణ పూజితే నందికేశ్వరే
శుద్ధ్యంతి సర్వపాపేభ్యః ఏకబిల్వం శివార్పణమ్. 3
సాలగ్రామశిలామేకాం జాతు విప్రాయ యోఽర్పయేత్
సోమయజ్ఞ మహాపుణ్యం ఏకబిల్వం శివార్పణమ్. 4
దంతకోటి సహస్రాణి వాజపేయ శతానిచ
కోటికన్యా మహాదానం ఏకబిల్వం శివార్పణమ్. 5
పార్వత్యాస్స్వేదతోత్పన్నం మహాదేవస్య సత్ప్రియం
బిల్వవృక్షం నమస్యామి ఏకబిల్వం శివార్పణమ్. 6
దర్శనం బిల్వవృక్షస్య స్పర్శనం పాపనాశనం
అఘోరపాపసంహారం ఏకబిల్వమ్ శివార్పణమ్. 7
మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే
అగ్రత శ్శివరూపాయ ఏకబిల్వం శివార్పణమ్. 8
బిల్వాష్టక మిదం పుణ్యం యఃపఠేచ్ఛివసన్నిధౌ సర్వపాప వినిర్ముక్తః శివలోక మవాప్నుయాత్॥



## దారిద్ర్య దహనస్తోత్రమ్

విశ్వేశ్వరాయ నరకాంతక తారణాయ కర్ణామృతాయ శశిశేఖర ధారణాయ ।
కర్పూరకాంతి ధవళాయ జటాధరరాయ దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ ॥ 1
గౌరీప్రియాయ రజనీశ కలాధరాయ కాలాంతకాయ భుజగాధిప కంకణాయ ।
గంగాధరాయ గజరాజ విమర్దనాయ దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ ॥ 2
భక్తప్రియాయ భవరోగ భయాపహాయ ఉగ్రాయ దుఃఖభవసాగర తారణాయ ।
జ్యోతిర్మయాయ గుణనామ సునృత్యకాయ దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ ॥ 3
చర్మాంబరాయ శవభస్మ విలేపనాయ ఫాలేక్షణాయ మణికుండల మండితాయ ।
మంజీర పాదయుగళాయ జటాధరాయ దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ ॥ 4
పంచాననాయ ఫణిరాజ విభూషణాయ హేమాంశుకాయ భువనత్రయ మండితాయ ।
ఆనందభూమి వరదాయ తమోమయాయ దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ ॥ 5
భానుప్రియాయ భవసాగరతారణాయ కాలాంతకాయ కమలాసన పూజితాయ ।
నేత్రత్రయాయ శుభలక్షణ లక్షితాయ దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ ॥ 6
రామప్రియాయ రఘునాథ వరప్రదాయ నా(గ)మప్రియాయ నరకార్ణవతారణాయ ।
పుణ్యేషు పుణ్యభరితాయ సురార్చితాయ దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ ॥ 7
ముక్తీశ్వరాయ ఫలదాయ గణేశ్వరాయ గీతప్రియాయ వృషభేశ్వర వాహనాయ ।
మాతంగ చర్మవసనాయ మహేశ్వరాయ దారిద్ర్య దుఃఖ దహనాయ నమశ్శివాయ ॥ 8
వసిష్ఠేనకృతంస్తోత్రం సర్వరోగ నివారణమ్ । సర్వసంపత్కరం శీఘ్రం పుత్రపౌత్రాదివర్ధనమ్ ॥
త్రిసంధ్యం యఃపఠేన్నిత్యం సహి స్వర్గ మవాప్నుయాత్. *ఇతి శ్రీవసిష్ఠ విరచితం దారిద్ర్యదహన స్తోత్రమ్*

## విశ్వనాథాష్టకమ్

గంగాతరంగ రమణీయజటాకలాపం గౌరీనిరంతర విభూషిత వామభాగమ్
నారాయణప్రియ మనంగ మదాపహారం వారాణసీపురపతిం భజవిశ్వనాథమ్ 1
వాచామగోచర మనేక గుణస్వరూపం వాగీశవిష్ణుసుర సేవిత పాదపీఠమ్
వామేన విగ్రహవరేణ కళత్రవంతం వారాణసీపురపతిం భజవిశ్వనాథమ్. 2
భూతాధిపంభుజగభూషణభూషితాంగం వ్యాఘ్రాజినాంబరధరం జటిలంత్రినేత్రమ్।
పాశాంకుశాభయవర ప్రదశూలపాణిం వారాణసీపురపతిం భజవిశ్వనాథమ్. 3
శీతాంశుశోభిత కిరీట విరాజమానం ఫాలేక్షణానలవిశోషిత పంచబాణమ్
నాగాధిపారచితభాసుర కర్ణపూరం వారాణసీపురపతిం భజవిశ్వనాథమ్. 4
పంచాననం దురితమత్తమతంగజానాం నాగాంతకం దనుజపుంగవపన్నగా
దావానలం మరణశోకజరాటవీనాం వారాణసీపురపతిం భజవిశ్వనాథమ్. 5
తేజోమయం సగుణనిర్గుణ మద్వితీయమానందకందమపరాజితమప్రమేయమ్
నాగాత్మకం సకలనిష్కళ మాత్మరూపం వారాణసీపురపతింభజవిశ్వనాథమ్ 6
ఆశాం విహాయ పరిహృత్య పరస్య నిందాం పాపేరతించ సునివార్య మనస్సమాధౌ
ఆదాయ హృత్కమలమధ్యగతం పరేశం వారాణసీపురపతిం భజవిశ్వనాథమ్. 7
రాగాదిదోషరహితం స్వజనానురాగం వైరాగ్యశాంతినిలయం గిరిజాసహాయమ్
మాధుర్యధైర్యసుభగం గరళాభిరామం వారాణసీపురపతిం భజవిశ్వనాథమ్. 8
వారణసీపురపతేః స్తవనం శివస్య వ్యాసోక్త మష్టక మిదం పఠతే మనుష్యః।
విద్యాం శ్రియం విపులసౌఖ్య మనంతకీర్తిం సంప్రాప్యదేహవిలయే లభతేచమోక్షమ్.॥ 9
విశ్వనాథాష్టక మిదం యఃపఠే చ్ఛివసన్నిధౌ। శివలోక మవాప్నోతిశివేనసహ మోదతే.



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

కార్తీకమాసంలో దశమి, ఏకాదశి, ద్వాదశి తిథులలో శ్రీమహావిష్ణువును తులసి దళాలతోటీ, కమలాలతోటీ పూజిస్తే జీవించినన్నాళ్లూ ధనానికి లోటులేకుండా ఉండి, సమస్త సౌఖ్యాలు కలగడంతోపాటు అంత్యమున జన్మరాహిత్యం కలుగుతుందట. అదేవిధంగా ఆరుద్ర నక్షత్రంరోజున, మాసశివరాత్రినాడు, సోమవారంనాడు, కార్తీక పున్నమినాడూ రుద్రాభి షేకంచేసి, బిల్వదళాలతోనూ, రుద్రాక్షలతోనూ పూజించిన వారికి అనంతమైన సౌఖ్యాలతోబాటు అంత్యమున శివసాయుజ్యం పొందుతారని కార్తీక పురాణం చెబుతోంది.

---

**కార్తీక శు.పాడ్యమి :** తెల్లవారుజామునే లేచి స్నానంచేసి, అందుబాటులో ఉన్న ఏదైనా ఆలయానికెళ్ళి, నేను చేయదలచుకున్న కార్తీక వ్రతం నిర్విఘ్నంగా సాగేటట్లు అనుగ్రహించమని ప్రార్థించి సంకల్పం చెప్పుకుని ఆకాశదీపాన్ని సందర్శించుకోవాలి.

**విదియ :** ఈ రోజు సోదరి ఇంటికెళ్ళి ఆమెచేతి భోజనంచేసి, కానుకలు ఇచ్చి వచ్చిన వారికి యమగండం వాటిల్లదని పురాణోక్తి.

**తదియ :** అమ్మవారికి కుంకుమపూజ చేయించుకోవడంవల్ల సౌభాగ్యసిద్ధి.

**చవితి :** కార్తీకశుద్ధ చవితి నేడు నాగుల చవితి సందర్భంగా సుబ్రహ్మణ్యేశ్వరునికి పుట్టలో పాలుపోయాలి.

**పంచమి :** దీనికి జ్ఞానపంచమి అని పేరు. ఈ రోజు సుబ్రహ్మణ్య ప్రీత్యర్థం అర్చనలు చేయించుకున్నవారికి జ్ఞానవృద్ధి కలుగుతుంది.

**షష్ఠి :** నేడు బ్రహ్మచారికి ఎర్రగళ్ల కండువా దానంచేస్తే సంతాన ప్రాప్తి కలుగుతుందని ప్రతీతి.

**సప్తమి :** ఈరోజు ఎర్రని వస్త్రంలో గోధుమలు పోసి దానమివ్వడంవల్ల ఆయుష్షు వృద్ధి అవుతుంది.

**అష్టమి :** ఈ గోపాష్టమినాడు చేసే గోపూజ విశేష ఫలితాలనిస్తుంది.

**నవమి :** నేటినుంచి మూడురోజులపాటు విష్ణుత్రిరాత్ర వ్రతాన్ని ఆచరించాలి.

**దశమి :** ఈరోజు రాత్రి విష్ణుపూజ చేయాలి.

**ఏకాదశి :** ఈ ఏకాదశికే బోధనైకాదశి అనిపేరు. ఈరోజు విష్ణుపూజ చేసిన వారికి ఉత్తమ గతులు కలుగుతాయి.

**ద్వాదశి :** ఈరోజు క్షీరాబ్ధి ద్వాదశి. నేటి సాయంకాలం ఉసిరిమొక్క, తులసి మొక్కల వద్ద దామోదరుని ఉంచి పూజచేసి, దీపాలు వెలిగించడం సర్వపాపాలనూ నశింపచేస్తుంది.

**త్రయోదశి :** ఈరోజు సాలగ్రామ దానం చేయడంవల్ల సర్వకష్టాలూ దూరమవుతాయి.

**చతుర్ధశి :** పాషాణ చతుర్ధశి వ్రతం చేసుకునేందుకు నేడు మంచిది.

**కార్తీకపూర్ణిమ :** మహా పవిత్రమైన ఈరోజు నదీస్నానంచేసి శివాలయంవద్ద జ్వాలాతోరణ దర్శనం చేసుకోవడంవల్ల సర్వపాపాలూ ప్రక్షాళనమవుతాయి.



**కార్తీక బహుళపాడ్యమి :** ఈరోజు ఆకుకూర దానంచేస్తే శుభం.

**విదియ :** వనభోజనం చేయడం విశేష ఫలాలనిస్తుంది.

**తదియ :** పండితులకు,గురువులకు తులసిమాలను సమర్పించడంవల్ల తెలివితేటలు వృద్ధి అవుతాయి.

**చవితి :** పగలంతా ఉపవసించి, సాయంత్రంవేళ గణపతిని గరికతో పూజించి, ఆ గరికను తలగడ కిందపెట్టుకుని పడుకుంటే దుస్స్వప్న దోషాలు తొలగి సకల సంపదలూ కలుగుతాయి.

**పంచమి :** చీమలకు నూకలు చల్లడం, శునకాలకు అన్నం తినిపించడం శుభ ఫలితాలనిస్తుంది.

**షష్ఠి :** గ్రామదేవతలకు పూజ జరిపించడం మంచిది.

**సప్తమి :** జిల్లేడు పూలతోగుచ్చిన దండను ఈశ్వరునికి సమర్పిస్తే సంపదలు వృద్ధి అవుతాయి.

**అష్టమి :** కాలభైరవాష్టకం చదివి గారెలతో దండచేసి కాలభైరవానికి (కుక్కకు) సమర్పించడంవల్ల ధనప్రాప్తి కలుగుతుంది.

**నవమి :** వెండి లేదా రాగి కలశంలో నీరుపోసి పండితునికి దానమిస్తే పితృ దేవతలు తరిస్తారు.

**దశమి :** నేడు అన్న సంతర్పణచేస్తే విష్ణువుకు ప్రీతిపాత్రులై, కోరికలు తీరతాయి.

**ఏకాదశి :** విష్ణ్వాలయంలో దీపారాధన, పురాణశ్రవణం, పఠనం, జాగరణ విశేషఫలప్రదం.

**ద్వాదశి :** అన్నదానం లేదా స్వయంపాకం సమర్పించడం శుభప్రదం.

**త్రయోదశి :** నవగ్రహారాధన చేయడంవల్ల గ్రహదోషాలు తొలగుతాయి.

**చతుర్దశి :** ఈమాస శివరాత్రినాడుచేసే ఈశ్వరార్చన, అభిషేకం అపమృత్యు దోషాలను, గ్రహబాధలను తొలగిస్తాయి.

**అమావాస్య :** నేడు పితృదేవలపేరిట అన్నదానం లేదా ఉప్పు పప్పుతో కూడిన సమస్త సంబారాలను దానం చేయడంవల్ల పెద్దలకు నరకబాధ తొలగి, స్వర్గసుఖాలు కలుగుతాయి.

---

ఈ మాసంలో చేసేస్నానం దానజపాలవల్ల అనంతమైన పుణ్యఫలాలు ప్రాప్తి స్తాయి. అయితే అలా రోజూ చేయలేనివారు కనీసం ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ, సోమవారాలలో లేదా ఒక్క పూర్ణిమ లేదా కనీసం ఒక్క సోమవారంనాడయినాసరే నియమ నిష్ఠలతో ఉపవాసంఉండి, గుడికి వెళ్ళి దీపం వెలిగిస్తే లభించే పుణ్యఫలాన్ని వర్ణించడం తనవల్ల కాదని బ్రహ్మచెప్పాడు. కార్తీక పౌర్ణమినాడు పగలంతా ఉపవాస ముండి రుద్రాభిషేకం చేయించి శివాలయంలో మట్టిప్రమిదలో 365 ఒత్తులను ఆవునేతితో వెలిగిస్తే సమస్త పాపాలూ భస్మీపటలమై ఇహలోకంలో సర్వసౌఖ్యాలను అనుభవించి అంత్యంలో పుణ్యలోకాలు పొందుతారని కార్తీక పురాణంలోని అనేక గాథలు, ఇతివృత్తాలు, ఉపకథలనుబట్టి తెలుస్తుంది. క్షీరాబ్ధిద్వాదశి వ్రతం, సత్యనారా యణస్వామి వ్రతం, కేదరేశ్వర వ్రతం కార్తీకమాసంలో చేసుకునే వ్రతాలు.

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | |
|---|---|
| శ్రీ వినాయక వ్రతం | వెల రూ.5 |
| శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 20 |
| శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 9 |
| లక్ష్మీగణపతి పూజాకల్పం | ... |
| వరలక్ష్మీ వ్రతం | 5 |
| కేదారేశ్వర వ్రతం | 5 |
| త్రినాధ వ్రతం(కలర్) | 5 |
| త్రినాధవ్రతం(సాదా) | 3 |
| క్షీరాబ్ధి వ్రతం | 5 |
| మంగళ గౌరీవ్రతం | 9 |
| వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 15 |
| శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 15 |
| కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 15 |
| సంతోషీమాతా వ్రతం | 15 |
| ఏడు శనివారాల వ్రతం | 15 |
| సత్యనారాయణవ్రతం | 15 |
| శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 15 |
| శివదీక్ష | 9 |
| మార్గశిర లక్ష్మీవారాలవ్రతం | ... |
| శ్రీ వేంకటేశ్వర (దీక్ష) గోవిందమాల | ... |
| కాత్యాయనీ వ్రతం | 15 |
| సౌభాగ్య గౌరీవ్రతం | 15 |
| తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 30 |
| స్త్రీల వ్రతకథలు | 25 |
| స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి(నేదునూరిగంగాధరరావుగారి) | 45 |
| స్త్రీలపాటలు (కామేశ్వరీపాటతో) | 27 |
| సర్వదేవతా పూజావిధానం | 15 |
| ఆరువ్రతాలు | 25 |
| ధన్వంతరీ వ్రతకల్పం | 9 |
| రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 9 |
| పార్వతీ నిత్యపూజ | 9 |
| తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 9 |
| శ్రీ చక్రపూజ | 9 |
| శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 30 |
| శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 30 |
| లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 9 |
| శ్రీలలితా నిత్యపూజ(లలితాసహస్రనామస్తోత్రంతో) | 9 |
| శ్రీ గాయత్రీ నిత్యపూజ | 9 |
| అన్నపూర్ణ నిత్యపూజ | 9 |
| శ్రీ బాలాత్రిపురసుందరీ నిత్యపూజ | 9 |
| శ్రీ సరస్వతీ నిత్యపూజ | 9 |
| మహిషాసుర మర్ధనీపూజ | 9 |
| రాజరాజేశ్వరీ నిత్యపూజ | 9 |
| శ్రీ దుర్గానిత్యపూజ | 9 |
| కాలభైరవ నిత్యపూజ | 9 |
| శివపూజ | 9 |
| వీరభద్ర పూజ | 9 |
| ఆంజనేయ నిత్యపూజ | 9 |
| నాగేంద్ర స్వామి పూజ | 9 |
| సుబ్రహ్మణ్య నిత్యపూజ | 9 |
| రామదేవుని కథ | 9 |
| శివదేవుని కథ | 9 |
| విష్ణుపూజ (విష్ణుసహస్రనామస్తోత్రసహితం) | 9 |
| శ్రీకృష్ణ పూజ, గోపూజ | 9 |
| లక్ష్మీనరసింహపూజ | 9 |
| రాఘవేంద్రపూజ | 9 |
| విశ్వకర్మపూజ | 9 |
| శనైశ్చరపూజ | 9 |
| వేంకటేశ్వరపూజ | 9 |
| బ్రహ్మంగారి నిత్యపూజ | 9 |
| సూర్య నిత్యపూజ | 9 |
| నవగ్రహ నిత్యపూజ | 9 |
| సకలదేవతా అష్టోత్తర శతనామావళీపూజ | 9 |
| పంచాయతన పూజ | 45 |
| రుక్మిణీ కల్యాణం | 15 |
| అష్టనాగపూజ | 30 |
| ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 30 |
| ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 30 |
| ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 30 |
| ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 30 |
| సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 20 |
| పంచముఖ ఆంజనేయనిత్యపూజ | 15 |
| హనుమద్ వ్రతం | 30 |
| 28 వ్రతములు | 99 |
| పూజలు ఎందుకుచేయాలి ? | 30 |
| కలశపూజలు (9ఒకేసారి) | 150 |
| కలశపూజలు (విడివిడిగా) | 150 |
| ఉమామహేశ్వర వ్రతం | 30 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | |
|---|---|
| శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు | 31 |
| సర్వదేవతా స్తోత్రమంజరి | 99 |
| సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 20 |
| విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 20 |
| లలితా సహస్రనామ స్తోత్రమ్(క్రౌన్) | 30 |
| లలితా సహస్రనామములు | 18 |
| లక్ష్మీ సహస్రనామములు | 18 |
| దుర్గా సహస్రనామములు | 18 |
| ఆంజనేయ సహస్రనామములు | 18 |
| శివ సహస్రనామములు | 18 |
| విష్ణు సహస్రనామములు | 18 |
| గణపతి సహస్రనామములు | 18 |
| సుబ్రహ్మణ్య సహస్రనామములు | 18 |
| గాయత్రి సహస్రనామములు | 18 |
| లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 18 |
| శ్రీరామా సహస్రనామములు | 18 |
| లక్ష్మీనృసింహసహస్రనామములు | 18 |
| సరస్వతి సహస్రనామములు | 18 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | |
|---|---|
| లక్ష్మీగణపతి సహస్రనామములు | 18 |
| సూర్యసహస్రనామములు&ఆదిత్యహృదయం | 18 |
| శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 18 |
| మణిద్వీపవర్ణన (పెద్దది) | 18 |
| సంధ్యావందనం | 18 |
| మంత్రపుష్పమ్ | 18 |
| హనుమాన్ చాలీసా | 7 |
| (పాకెట్) మణిద్వీపవర్ణన | 7 |
| ఆరు చాలీసాలు | 9 |
| శివారాధన (శివస్తోత్రాలు) | 7 |
| వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 7 |
| ఆరుదండకాలు | 5 |
| వేంకటేశ్వర గోవిందనామములు | 5 |
| అష్టలక్ష్మి స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 7 |
| దేవీఖడ్గ మాలాస్తోత్రమ్(మహిషాసురమర్దనీ స్తోత్రంతో) | 7 |
| నమశ్శివాయ గేయామృతం | 5 |
| బాలాత్రిపుర సుందరీ స్తోత్రకదంబం | 81 |
| సుందరకాండ (పాకెట్) | 9 |
| భగవద్గీత మూలం | 18 |
| రామరక్షాస్తోత్రమ్ | 18 |
| స్తోత్ర రత్నావళి | 30 |
| పురాణపండలలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్ (మినీ) | 8 |
| పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్ (మినీ) | 8 |
| పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 8 |
| పురాణపండ ఆదిత్య హృదయం | 8 |
| మంత్రపుష్పం (మినీ) | 8 |
| శివానందలహరి-సౌందర్యలహరి | 30 |
| కుజదోషం | 9 |
| కాలసర్ప దోషం | 9 |
| మీ అప్పులు తీరాలా? | 9 |
| దృష్టిదోషాలు నివారణ | 9 |
| సర్వదేవతా ధ్యానశ్లోకములు | 9 |
| పంచసూక్తములు | 9 |
| సంధ్యావందనం | 9 |
| శ్రీరామదూతంశిరసానమామి(తాత్పర్యంతో) | 9 |
| రుద్రనమకమ్-చమకమ్ | 9 |
| మన్యుసూక్త-మంత్రపారాయణం | 9 |
| గాయత్రీమంత్రాలు | 9 |
| పంచరత్న స్తోత్రాలు | 9 |
| కరావలంబ స్తోత్రాలు | 9 |
| దశావతార స్తోత్రాలు | 9 |
| అష్టోత్తర శతనామస్తోత్రాలు | 9 |
| భుజంగ స్తోత్రాలు | 9 |
| ప్రాతఃస్మరణాలు | 9 |
| జపమంత్రాలు | 9 |
| సర్వదేవతా సుప్రభాతములు | 9 |
| ద్వాదశ నామస్తోత్రాలు | 9 |
| కుమారస్వామి స్తోత్రమాల | 9 |
| సుదర్శన స్తోత్రమాల | 9 |

| | |
|---|---|
| హయగ్రీవ స్తోత్రమాల | 9 |
| దక్షిణామూర్తి స్తోత్రమాల | 9 |
| పంచముఖఆంజనేయస్తోత్రమ్ | 9 |
| దండక రత్నాలు | 9 |
| ద్వాదశ జ్యోతిర్లింగాలు-పంచారామాలతో | 9 |
| శ్రీసూక్తం పురుష సూక్తం | 9 |
| పంచ అధర్వణ శీర్షములు | 9 |
| ప్రార్థనా శ్లోకములు | 9 |
| గణపతి స్తోత్రమాల | 9 |
| శ్రీ గురుగీత | 9 |
| సర్వదేవతా కవచములు | 9 |
| సర్వదేవతా అష్టకములు | 9 |
| హిందూ సంస్కృతిసంప్రదాయాలు | 9 |
| విష్ణు స్తోత్రమాల | 9 |
| దేవీ స్తోత్రమాల | 9 |
| శివస్తోత్రమాల | 9 |
| విష్ణు స్తోత్రములు | 9 |
| భర్తృలహరి సుభాషితాలు | 9 |
| నవవిధ భక్తిమార్గాలు | 9 |
| నవదుర్గలు | 9 |
| దశమహావిద్యలు | 9 |
| తిరుపతి వెళదాం | 9 |
| నవగ్రహస్తోత్రమాల | 30 |
| మహాన్యాసమ్ | 30 |
| సుందరకాండ గానామృతం | 30 |
| సంధ్యా వందనం (పెద్దది) | 30 |
| పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | |
| లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 36 |
| లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 36 |
| స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 81 |
| మూకపంచశతీ | 81 |
| పురాణపండవారి సౌందర్యలహరి (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) | 108 |
| గోమాతపూజావిధానము | 7 |
| ఆనందసిద్ధి - శ్రీదేవీ స్తోత్రమాల | 108 |

### 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | |
|---|---|
| శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 99 |
| సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 99 |
| బొమ్మల గురుచరిత్ర | ... |
| బొమ్మల సాయిచరిత్ర | ... |
| బాలలబాబా శ్రీ సాయిచరితం | 9 |
| శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 99 |
| శ్రీసాయిసన్నిధిద్వారకామాయిలీలలు | .... |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 50 |
| శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 50 |
| దాసగణకృత శ్రీసాయి చరిత్ర | 30 |
| నవనాథ చరిత్ర | 90 |
| శ్రీ సాయిచరిత్ర(బైండు)ప్రయాణపుపారాయణగ్రంథం | 50 |
| శ్రీ గురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 50 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | |
|---|---|
| సత్యదత్తవ్రతం దత్తాత్రేయ పూజాకల్పం,సహస్రంతో | 15 |
| అనఘాదేవీ వ్రతం | 15 |
| శ్రీ సాయిసచ్చరిత్ర గానామృతం | 15 |
| శ్రీ గురుచరిత్ర గానామృతం | 45 |
| భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 25 |
| మనసులోనిప్రశ్నకుశ్రీసాయిబాబాజవాబులు | 25 |
| అక్షరక్రమములో శ్రీసాయిసూక్తులు | 25 |
| శ్రీసాయి అష్టోత్తరశతనామావళీమాహాత్మ్యం | 25 |
| శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 15 |
| శ్రీ సాయిభజనమాల | 15 |
| శ్రీ సాయి భజన్స్ | 15 |
| శ్రీ సాయిభక్తి గీతాలు | 15 |
| శిరిడిహారతులు (భావంతో) | 15 |
| ప్రతిగురువారంసాయినిత్యపూజ | 8 |
| "శ్రీసాయి"కోటి | 15 |
| "శ్రీసాయిరామ్"కోటి | 12 |
| ద్వారకామాయి భక్తిగీతాలు | 9 |
| శ్రీ సాయిబాబా భక్తిమాల | 9 |
| శ్రీలక్ష్మి సాయిభక్తిమాల | 9 |
| శ్రీ ద్వారకామాయిభక్తిమాల | 9 |
| శ్రీ శిర్డీభక్తిమాల | 9 |
| శ్రీ సాయిబాబా భక్తిమాల | 9 |
| శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 9 |
| శ్రీ సాయివేయినామాలు | 4 |
| శ్రీ సాయి సహస్ర నామావళి | 9 |
| శ్రీ సాయి చాలీసా-సుప్రభాతం | 9 |
| శ్రీ సాయినాధ చాలీసా | 9 |
| శ్రీ సాయి హారతులు (పాకెట్) | 9 |
| శ్రీ సాయి నిత్యపూజ (పాకెట్) | 9 |
| శ్రీ దత్తాత్రేయ నిత్యపూజ F | 9 |
| శ్రీ సాయి సూక్తులు | 9 |
| శ్రీ సాయి స్తవనమంజరి | 9 |
| శ్రీసాయి నక్షత్రమాలిక | 9 |
| హిందీ శ్రీ సాయి హారతులు | 10 |
| భక్తుల సందేహాలకుబాబా సమాధానాలు | 45 |
| శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 45 |
| శ్రీ షిర్డీసాయి లీలామృతం (VG) | 25 |
| ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 10 |
| షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 90 |
| సాయిపూజావిధి | 30 |
| సాయిమహిమ | .... |
| సాయిసత్యవ్రతం | 15 |
| సాయి అనుగ్రహమ్ | 116 |
| నవగురువారాల వ్రతకల్పము | 12 |
| శ్రీదత్తలీలామృతము | 72 |
| హృదయంలో సాయి | 12 |
| శ్రీశిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్చరిత్ర) | 81 |

## 4. జ్యోతిషాలు

| | |
|---|---|
| 'శుభసమయ' గంటల పంచాంగం | 30 |
| సనాతన వైదిక బ్రాహ్మణ పంచాంగం (వంగిపురపువారి పత్రికసైజ్‌పంచాంగం) | 69 |
| 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 50 |
| చిత్రాలగురుమూర్తిగుప్తాపంచాంగము | 50 |
| గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 116 |
| శ్రీచక్ర పంచాంగము(రాష్ట్రతొలిమహిళపంచాంగకర్త) | 30 |
| వేంకట్రామా&కో సిద్ధాంతుల రేలంగితంగిరాలవారి గంటలపంచాంగము | 30 |
| తంగిరాల పెద్దపంచాంగం | 39 |
| కాలచక్రం జ్యోతిష క్యాలండర్ | 20 |
| గ్రహబలం క్యాలండర్(శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 20 |
| శుభలగ్నం (తంగిరాల) క్యాలండర్ | 20 |
| శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 20 |
| సాదా క్యాలండర్ | 5 |
| పాకెట్ క్యాలండర్ | 10 |
| తాజకనీలకంఠీయమ్ | 100 |
| 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 207 |
| 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 150 |
| కేరళ జ్యోతిష రహస్యాలు | 150 |
| జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 150 |
| మానసాగరి జాతకపద్ధతి | 150 |
| వరాహమిహిర జాతకపద్ధతి | 150 |
| వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 81 |
| సింపుల్ రెమిడీస్ | .... |
| హోరాసార | ..... |
| శంభు హోరప్రకాశిక | ..... |
| పూర్వ పరాశరి | 100 |
| పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200 |
| 1940-60వరకు పాతపంచాంగములు | 225 |
| ప్రశ్న సింధు | 90 |
| నక్షత్ర విశేష ఫలితాలు | 36 |
| సర్వార్థ ఫలచంద్రిక | 90 |
| సూర్యసిద్ధాంత పంచాంగగణితంచేయడంఎలా? | 150 |
| దృక్సిద్ధాంత పంచాంగగణితం చేయడంఎలా? | 150 |
| ఆయుర్దాయ నిర్ణయం | 36 |
| పంచప్రాచీన జ్యోతిషాలు | 36 |
| జాతక గణిత ప్రవేశిక | 30 |
| భృగు సూత్రాలు | 36 |
| జ్యోతిషమర్మబోధిని | 45 |
| జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 45 |
| ముహూర్తం నిర్ణయించడంఎలా? | 45 |
| జాతక మకరందం | 30 |
| జ్యోతిష సరస్వతి | 30 |
| మీజననకాల విశేషాలు | 30 |
| ముహూర్త విజ్ఞాన భాస్కరం | 30 |
| జ్యోతిష స్వయంబోధిని | 30 |
| శుభముహూర్త శిరోమణి | 30 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | |
|---|---|
| నక్షత్ర ఫలమంజరి | 30 |
| పంచాంగం చూసే విధానం | 30 |
| సర్వార్థ జ్యోతిషం | 30 |
| ప్రాథమిక జ్యోతిషం | 30 |
| నవరత్నములు శుభయోగములు | 30 |
| జ్యోతిషభావఫలచంద్రిక-1 | ... |
| శుభశకునాలు | 20 |
| హస్తరేఖాఫలితాలు | 30 |
| సంఖ్యల్లో భవిష్యత్ | 30 |
| ముహూర్త దీపిక | 81 |
| పుట్టుమచ్చలు ఫలితాలు | 20 |
| కలలు ఫలితాలు | 20 |
| నిత్యజీవితంలో అదృష్ట సంఖ్యలు | 9 |
| నిత్యజీవితంలో నక్షత్రాలు | 9 |
| జాతక చక్రం వేయడం ఎలా? | 30 |
| మానసాగరి(ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250 |
| జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 90 |
| గుప్తా శతాబ్ది పంచాంగం(1940-2050) | 900 |
| ప్రశ్నచండేశ్వరమ్ | 45 |
| జాతకాలంకారం | 36 |
| జ్యోతిష వైద్య రత్నావళి | 36 |
| ద్వాదశభావ ఫలచంద్రిక | 250 |
| జాతకచక్రం మీరే వేసుకోవచ్చు | 30 |
| జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 90 |
| అంగసాముద్రికం | 30 |
| హస్త సాముద్రికం | 40 |
| వధూవర గుణ సమ్మేళనం | .... |
| లాల్ కితాబ్ | 81 |
| జాతకరాజము | 36 |
| శకునశాస్త్రం | 36 |
| ఆధునికప్రశ్నశాస్త్రం | 100 |
| పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 150 |
| అష్టకవర్గు | 45 |
| బృహత్‌జాతకం(ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 200 |
| లగ్నరత్నాకరం | 36 |
| షట్పంచాశిక | 120 |
| 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 150 |
| 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 207 |
| కె.పి.జ్యోతిషం (పరిచయం) | 45 |
| ముహూర్తచింతామణి | 81 |
| సూర్యచంద్ర గ్రహణములు | 45 |
| ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 150 |
| అదృష్టరెమెడీస్ | 99 |
| ములుగువారిరాశిఫలితాలు(12రాశులువారికి) | 36 |
| ములుగువారిరాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 10 |
| గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 36 |
| జ్యోతిష రెమిడీస్ | 300 |
| జాతక రహస్యాలు | 250 |
| జాతకమార్తాండం (కొండపల్లి) | 250 |
| జ్యోతిషవిద్యాప్రకాశిక (కొండపల్లి) | 250 |
| గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 90 |
| శనిగ్రహరెమిడీస్ | 90 |
| జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 90 |
| నాడీజ్యోతిషం | 45 |
| వివాహజ్యోతిషమంజరి | 45 |
| గార్గేయం మీ గ్రహబలం రెమిడీస్ | .... |
| మీ పుట్టినతేదీనిబట్టి మీ జీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) | 81 |
| నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 45 |
| లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 45 |
| గౌతమసంహిత | 45 |
| హోరరత్నమాల | 45 |
| **బి.వి.రామన్ గారి గ్రంథములు** | |
| జ్యోతిష విద్యారంభం | 50 |
| గ్రహభావ బలములు | 50 |
| కాలచక్రదశ | 50 |
| అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50 |
| జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50 |
| పురోగామి జాతకం | 50 |
| భావార్థరత్నాకరం | 75 |
| భారతీయజ్యోతిష సర్వస్వం | 75 |
| అష్టకవర్గ పద్ధతిః | 75 |
| జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75 |
| ప్రశ్నతంత్ర | 75 |
| ముహూర్తం | 75 |
| విశిష్ట జాతకములు | 125 |
| భారతీయఫలితజ్యోతిషం | 125 |
| 300 ముఖ్యమైన యోగములు | 125 |
| జాతకంపరిశీలించడంఎలా ? | 250 |
| **రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు** | |
| బృహత్‌పరాశరహోరాశాస్త్రము-1 | రూ.200 |
| బృహత్‌పరాశరహోరాశాస్త్రము-2 | 200 |
| బృహత్‌పరాశరహోరాశాస్త్రము-3 | 200 |
| బృహత్‌పరాశరహోరాశాస్త్రము-4 | 200 |
| భావార్థరత్నాకరము | 75 |
| ముహూర్త చింతామణి | 150 |
| స్వప్న శాస్త్రము | 30 |
| శతయోగమంజరి | 75 |
| వ్రతనిర్ణయకల్పవల్లి | 250 |
| వాస్తుశాస్త్రవివేకము-1 | 150 |
| వాస్తుశాస్త్రవివేకము-2 | 150 |
| వాస్తుశాస్త్రవివేకము-3 | 150 |
| వాస్తుశాస్త్రవివేకము-4 | 150 |
| అనుభవసులభవాస్తు - 1 | 75 |
| అనుభవసులభవాస్తు - 2 | 125 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

## 5. వాస్తులు

| | |
|---|---|
| 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి | 180 |
| వాస్తుశాస్త్ర రహస్యములు (బైండు) | 108 |
| వాస్తునుబట్టి మీ ఇల్లు | 30 |
| మీరూ మీ వాస్తు | 30 |
| గృహవాస్తు చిట్కాలు | 30 |
| వాస్తు పూజ | 30 |
| వాస్తు సూత్రములు | 30 |
| వాస్తుశాస్త్ర రహస్యాలు | 30 |
| వాస్తు సూక్తులు | 10 |
| గృహవాస్తు వర్గులు | 90 |
| డోలనవిద్య ఉపయోగాలు (డౌజింగ్) | 36 |
| విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 45 |
| విశ్వకర్మ వాస్తు శాస్త్రరీత్యా మీ ఇండ్ల ఆయములు | 81 |
| విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాల) | .... |
| ప్రాచీన వాస్తుశాస్త్రములు | 36 |
| ఆధునిక గృహవాస్తు | 81 |
| శుభవాస్తు | 207 |
| శుభవాస్తు సలహాలు | 36 |
| వాస్తుయంత్ర రత్నావళి | 90 |
| వాస్తుశాస్త్రం | 45 |
| హౌస్ ప్లాన్లు | 30 |
| గృహవాస్తుసారం | 30 |
| గృహవాస్తు చంద్రిక | 30 |
| గృహవాస్తు దర్పణం | 30 |
| జ్యోతిష - గృహవాస్తు చంద్రిక | .... |
| వాస్తురత్నాకరం (కొండపల్లి) | ... |
| వాస్తు శిరోమణి ,, | ... |
| శ్రీకృష్ణవాస్తు ,, | .... |
| పంచవాస్తు పారిజాతం ,, | 90 |
| వాస్తుడిండిమమ్ ,, | 45 |
| వాస్తుదుందిభి ,, | 90 |
| విశ్వకర్మవాస్తుశాస్త్రము ,, | ... |
| కృష్ణవాస్తుశాస్త్రము | 45 |
| శల్యవాస్తు,జలవాస్తు(దంతూరిపండరీనాథ్) | 81 |
| మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120 |

## 6. మంత్రశాస్త్రాలు

| | |
|---|---|
| శ్రీ లక్ష్మీ తంత్రమ్ | 360 |
| శ్రీ గురు తంత్రం | 108 |
| సర్ప (నాగ)తంత్రం | 250 |
| మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360 |
| మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360 |
| శ్రీ దుర్గ తంత్రమ్ | 200 |
| మంత్రసిద్ధి | 90 |
| మంత్రసాధన | 45 |
| తంత్రజాలం | 45 |
| యక్షిణీ తంత్రం | 45 |
| పాశుపత తంత్రం | 90 |
| మంత్రానుష్ఠాన చంద్రిక | 45 |
| సర్వదేవతా మంత్రకవచములు | 45 |
| మంత్రాక్షరాలరహస్యం(బీజాక్షరనిఘంటువు) | 45 |
| సర్వదేవతా మంత్రరత్నావళి | 45 |
| దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 45 |
| సదాచార దీపిక | 45 |
| గాయత్రీ తంత్రమ్ | 108 |
| గుప్త సాధన తంత్రం | 45 |
| యంత్రసిద్ధి | 333 |
| మంత్రశక్తి | 45 |
| దత్తాత్రేయ తంత్రవిద్య | 45 |
| మంత్రశాస్త్రం (గ్రంథము) | 250 |
| తాంత్రిక పంచాంగం | 45 |
| హవన తంత్రం | 250 |
| పంచదశ మహాఖడ్గ తంత్రం | 90 |
| మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150 |
| ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360 |
| షోడశనిత్యతంత్రం | 250 |
| శాక్తేయతంత్రం | 250 |
| యోగినీ-వామకేశ్వరతంత్రం | 45 |
| రుద్రయామళతంత్రం | 250 |
| ప్రపంచసారతంత్రం | 45 |
| బదనిక తంత్రమ్ | 45 |
| ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 45 |
| రుద్రాష్టాధ్యాయః | 90 |
| పరశురామతంత్రమ్ | 108 |
| లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250 |
| గంధర్వ తంత్రమ్ | 45 |
| హిరణ్యశూలినీ తంత్రమ్ | 250 |
| మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250 |
| శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250 |
| కామధేనువు తంత్రం | 360 |
| శూలినీదుర్గాతంత్రం | 360 |
| సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 45 |
| మహామంత్రశాస్త్రసంగ్రహః | 150 |
| యంత్ర మంత్ర తంత్ర | 45 |
| శూలినీదుర్గాతంత్రం (చిన్నది) | 100 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | |
|---|---|
| భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 45 |
| గణేశ ఆరాధన 1 | 90 |
| గణేశోపాసన 2 | 90 |
| నవగ్రహారాధన | 144 |
| నవగ్రహవైభవం | 90 |
| నవగ్రహ రెమెడీస్ | 90 |
| నవగ్రహ వేదం | 90 |
| శనిగ్రహారాధన | 90 |
| ఆదిత్యారాధన | 90 |
| సుబ్రహ్మణ్యారాధన | 90 |
| శ్రీ శివ ఆరాధన | 90 |
| లక్ష్మీ ఆరాధన | 90 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | |
|---|---|
| హనుమదారాధన | 90 |
| లలితారాధన | 90 |
| శ్రీ చక్రారాధన | ... |
| గాయత్రీ ఆరాధన | 90 |
| వీరభద్రారాధన | 90 |
| కాలసర్ప యోగం | 90 |
| నిత్య జీవితములో రుద్రాక్షలు | 90 |
| నిత్య జీవితములో నవరత్నాలు | 90 |
| సుందరకాండ వచనం | 90 |
| వేదసూక్తములు | 90 |
| అష్టాదశపురాణములు | ... |
| వేమన పద్యసారామృతం | 90 |
| పండగలు పర్వదినాలు | 90 |
| కుజగ్రహారాధన | 90 |
| భైరవారాధన | 90 |
| సూక్తిరత్నాలు | 90 |
| మనుధర్మ శాస్త్రం (వచనంలో...) | 144 |
| పురాణపండ రామాయణం | 90 |
| పురాణపండ భారతం | 90 |
| పురాణపండ భాగవతం | 90 |
| శ్రీ లక్ష్మీసన్నిధి | 90 |
| సర్వదేవతా స్వరూపుడు వేంకటేశ్వరుడు | 90 |
| హనుమచ్చరిత్ర | 90 |
| పంచముఖ హనుమత్ వైభవం | 45 |
| శ్రీ దేవీ సప్తశతి | 90 |
| మానవధర్మాలు | ..... |
| గరుడపురాణం | 36 |
| మాఘపురాణం | 30 |
| శివపురాణం | 30 |
| వైశాఖపురాణం | 30 |
| స్థూలాక్షరి మాఘపురాణం | 45 |
| స్థూలాక్షరి శివపురాణం | 45 |
| స్థూలాక్షరి వైశాఖపురాణం | 45 |
| కార్తీక పురాణం | 25 |
| సర్వకార్యసిద్ధికి రామాయణపారాయణ | 45 |
| మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 150 |
| పెద్దబాలశిక్ష | 36 |
| గాయత్రీ మహిమ | 30 |
| మత్స్య యంత్ర మహిమ | 45 |
| పురాణనామ చంద్రిక | ...... |
| వేదమంత్ర సంహిత | 108 |
| వృక్షదేవతలు | 36 |
| హనుమద్విజయం | 30 |
| హనుమద్వైభవమ్ | 30 |
| యాజుష స్మార్త సంస్కార చంద్రిక | 150 |
| సనాతనవైదిక బ్రాహ్మణస్మార్తాగమకల్పమ్ | 150 |
| నవగ్రహ దర్శనమ్ | 90 |
| నిత్యజీవితంలో నవగ్రహాలు | 90 |
| సాలగ్రామములు | 90 |
| చతుర్వేదములు | 108 |
| సహస్రలింగార్చన | 120 |
| బృహత్ శివ స్తోత్ర రత్నాకరము | 200 |
| బృహత్ దేవీ స్తోత్రరత్నాకరము | 200 |
| బృహత్ విష్ణు స్తోత్రరత్నాకరము | 200 |
| కేదారనాథ్ బదరీనాథ్ యాత్రాగైడు | 36 |
| పంచమవేదం మహాభారతం | 81 |
| దేవుళ్ళు డాట్ కామ్ | 81 |
| తాళపత్ర సమాహార గోపురం | 144 |
| శ్రీ హయగ్రీవ ఆరాధన | 90 |
| శ్రీలక్ష్మీనరసింహ ఆరాధన | 90 |
| దైవారాధన | 90 |
| (సూరి) వాల్మీకి రామాయణం | 90 |
| గణపతిభాష్యం | 90 |
| దక్షిణావృత శంఖములు | 45 |
| 108 దివ్యదేశాల విష్ణుక్షేత్రదర్శని | 30 |
| ధర్మసింధువు(కేస్‌బైండింగ్) | 240 |
| గీతారాధన | 90 |
| యజుర్వేద ఉపనయనవివాహప్రయోగమంజరి | 90 |
| శ్రీ శివగీత | 108 |
| భారతీయ శైవక్షేత్రయాత్రాదర్శిని | 100 |
| చిలుకూరి బాలాజీచరిత్ర | 30 |
| నవయోగులు | 90 |
| ఆంధ్రప్రదేశ్‌లోనిదర్శించవలసిన ప్రముఖదర్గాలు | 90 |
| సకలదేవతా అష్టోత్తరశతనామావళి(పెద్దది) -(108 అష్టోత్తరశతనామావళులతో) | 90 |
| భగవత్‌స్తుతి | 90 |
| సూర్యోపాసన | 30 |

## 8. వైద్య గ్రంథాలు

| | |
|---|---|
| ఆహారం ఆరోగ్యం | 30 |
| మూలికావైద్య చిట్కాలు | 30 |
| ఆయుర్వేద వైద్య చిట్కాలు | 20 |
| ఆయుర్వేద వైద్యం | 30 |
| గృహవైద్య రహస్యాలు | 30 |
| ఆయుర్వేద వైద్యచింతామణి - సెట్ | ... |
| గృహవైద్యసారం | 30 |
| హోమియోవైద్యం (ద్వాదశలవణచికిత్స) | 45 |
| ప్రకృతివైద్యం | 30 |
| ఆహారం-వైద్యం | 81 |
| సంపూర్ణ ఆయుర్వేద-చిట్కా వైద్యం | 81 |
| ఆయుర్వేదమ్ | 30 |
| అనుపానతరంగిణి | .... |
| ఆయుర్వేద మూలికావైద్యదీపిక | 90 |
| దుంపకూరలు, ఆకుకూరలు, కాయగూరలు | |
| వాకడం - ఉపయోగాలు | 90 |
| ఆకుకూరలు | ... |
| వనమూలికావైద్యం | 300 |
| ఏకమూలికావైద్యం | 90 |
| అష్టాంగ హృదయం(4భాగాలు) | 1200 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

